# ప్రహేళికలు - పొడుపుకథలు

## ప్రహేళికలు - పొడుపుకథలు

- ఏ.వి.రమణరాజు

ప్రహేళిక అనేది సంస్కృతంలోని పేరు. ప్రహేళిక అంటే వాక్చమత్కార రూపమైన
క్రీడావిశేషరూపం అని అంటారు. ప్రహేళికలను గురించి దండి మహాకవి తన కావ్యాదర్శంలో 16 రకాలను వివరించాడు. అవి కాక ఇంకా అనేక రకాలున్నాయి.
తెలుగులో వీటిని పొడుపు కథలు అంటాము. వీటినే విచ్చుడు కథలు అని కూడ అంటారు.
ఇవికాక ఇంకా చాలా పేర్లున్నాయి. ఇంగ్లీషులో రెడిల్స్ అని అంటాము.
ఇక్కడ ఇచ్చినవన్నీ నా చిత్తకవితాప్రపంచం బ్లాగులో నాచే ప్రచురించినవి.
ఇంకా తెలుసుకో గోరినవారు నా చిత్రకవితాప్రపంచం బ్లాగును చూడగలరు.

అరువదిరెండుకుచంబులు
శిరమొక్కడు రెండువేలు చెవులున్ తానున్
ఇరువైరెండు భుజంబులు
తరుణీ! ఏయూరు నీది దాచక చెప్పుమా?

ఈ పద్యం చూడగా అరువదిరెండు కుచములు (చన్నులు), శిరము (తల) ఒకటి, తాను రెండువేల చెవులు,
ఇరువైరెండు భుజాలు, దాచకుండా నీది ఏవూరో చెప్పుము తరుణీ (ఓ స్త్రీ)! అనే అర్థం కనబడుతోంది

ఇది సరైన అర్థంగా కనబడటంలేదుకదా! సరైన అర్థం కావాలంటే దీన్ని ఈ విధంగా అర్థం తీసుకోవాలి.
అరువది అంటే తమిళ స్త్రీ, ఇరువై అంటే ఇరువగు - ఒప్పినట్టి - అని.

ఓ తమిళ స్త్రీ! రెండు కుచములతో, ఒక శిరముతో, రెండు వ్రేలాడు చెవులతో, తగినట్టి రెండు భుజాలతో ఉన్నావు. ఏవూరునీది - అనేది అర్థం.

కరచరణంబులు గల్గియు
కరచరణ విహీనుచేత, గడు దుర్బలుడై,
జలచరుడు పట్టువడియెను,

శిరహీనుడు చూచి నవ్వె చిత్రముగాగన్!

**కాళ్ళు చేతులు ఉన్నవాడు బలహీనుడై కాళ్ళు చేతులు లేని వానిచేత పట్టు బడిగా శిరము లేనివాడు**
**చూచి నవ్వాడట ఎంత చిత్రమో! - దీని భావం. కాళ్ళుచేతులు ఉన్నవాని కాళ్ళుచేతులు లేనివాడు**
**ఎలా పట్టుకున్నాడు. అది చూచి తలే లేనివాడు ఎలా నవ్వాడు?**

**అంటే దీనికి అర్థం ఇదికాదు.**
**కాదు కాదు ఇదే. మరెలాగంటే.........................**
**కాళ్ళుచేతులు ఉన్నవాడు అంటే**
**కప్ప, కాళ్ళుచేతులు**
**లేనివాడు అంటే పాము. శిరసులేనివాడు - పీత (ఎండ్రి). ఇప్పుడు కాళ్ళుచేతులు ఉన్న కప్పను కాళ్ళుచేతులు లేని**
**పాము నోట చిక్కింది. అది చూచి తలలేని పీత నవ్వింది. ఇది అసలు భావం.**

**సమాధానాలు ప్రహేళికలోనే ఉంటే వాటిని అంతర్లాపిక అనే రకానికి చెందిన ప్రహేళికగా చెబుతారు.**

అలాంటిదానికి ఉదాహరణ ఈ ప్రహేళిక కాని ఇది ఒక సమస్య దానికి కవి ఈ విధంగా ప్రహేళికలో పూరించాడు.
**"ఏకాదశినాఁడు సప్త మేడు గడియల్" - అనేది సమస్య**
పూరణ -
**శ్రీకాంతుని దిన మెన్నడు**
**రాకొమరుని కెద్ది ప్రియము రథతిథి యెన్నం**
**డేకొలఁది కన్నమరుగునొ**
**ఏకాదశినాఁడు సప్త మేడే గడియల్!**

దీనిలో - శ్రీకాంతుని దిన మెన్నడు? - విష్ణుని రోజేది ?
రాకొమరునికి ఎద్ది ప్రియము? - రథతిథి యెన్నండు?-
ఏకొలఁది కన్నమరుగునొ ? - ఏ కొలదికి (ఎంత సమయానికి) అన్నం అరుగుతుందో?-
ఈ ప్రశ్నలకు సమాధానాలు చివరిపాదంలోని పదాలను విరుచుకొని చూస్తే తెలుస్తుంది.
ఏకాదశినాఁడు సప్త మేడు గడియల్ - దీనిలో ఏకాదశి, నాఁడు, సప్తమి, ఏడుగడియల్
అనే పదాలుగా విడగొట్టిన ఈ విధంగా సమాధానాలవుతాయి.

శ్రీకాంతుని దిన మెన్నడు? - విష్ణుని రోజేది ? - ఏకాదశి
రాకొమరునికి ఎద్ది ప్రియము? - నాఁడు (దేశం)
రథతిథి యెన్నండు?- సప్తమి(తిథి)
ఏకొలఁది కన్నమరుగునొ ? - ఏ కొలదికి (ఎంత సమయానికి) అన్నం అరుగుతుందో? - ఏడుగడియల్

**ప్రహేళికలలో అనేక రకాలున్నాయి వాటిలో "పరిహారికా" అనేది ఒక రకం ప్రహేళిక.**
**"యౌగిక శబ్దాల పరంపర ఉన్నదే పరీహారికా ప్రహేళిక" అని మహాకవి దండి నిర్వచనం.**
**పరిహారికా ప్రహేళికకు ఉదాహరణ ఈక్రింది పద్యం**

**సురవర గురునకు సతి సుతు**
**వర జనకుని తండ్రి కూతు వరసుతు మామన్**
**శిరమందుగొన్న మరసుతు**
**నిరతము సేవింతు నియమ నిష్కలుషమతిన్**

సురవరగురు - బృహస్పతి, సతి - భార్య అయిన తార, సుతు- కుమారుడైన బుధుని,
వరజనకుని - తండ్రి అయిన చంద్రుని, తండ్రి- సముద్రుని, కూతురు - పుత్రిక అయిన లక్ష్మీదేవి, వరసుతు - మన్మధుని, మామన్ - చంద్రుని, శిరమందు గొన్న వర - తలనుదాల్చు శివుని, సుతు - వినాయకుని, నిరతము సేవింతు నియమ
నిశ్కలుమతిన్ - ఎల్లపుడు నియమముతో, కల్మషములేని మనసుతో సేవిస్తాను.

భావం :-
బృహస్పతి భార్య అయిన తార, తార కుమారుడైన బుధుని, బుధుని తండ్రి అయిన చంద్రుని,
చంద్రుని తండ్రి సముద్రుని, సముద్రుని పుత్రిక అయిన లక్ష్మీదేవి, లక్ష్మీదేవి కుమారుడైన మన్మధుని,
మన్మధుని మామ అయిన చంద్రుని, చంద్రుని తలనుదాల్చు శివుని, శివుని కుమారుడైన వినాయకుని
ఎల్లపుడు నియమముతో, కల్మషములేని మనసుతో సేవిస్తాను.

దీనిలో చివరగా తేలిన జవాబు శివుని కుమారుడైన వినాయకుని
ఎల్లపుడు నియమముతో, కల్మషములేని మనసుతో సేవిస్తాను.

**ప్రహేళికలలో మరో రకమైన ప్రహేళిక ఈ క్రింది పద్యం గమనించండి.**

**పక్షివర్యుడు పరగ పంచాక్షరముల**
**వాని తలదీయ క్షుద్రదేవత జనించు,**
**వాని తలదీయ తక్కెడ వరలుచుండు**
**దాన ప్రథమాక్షరము తీయ దనరు నృపతి**

ఇది ఒక పక్షి పేరు దీనిలో 5 అక్షరాలు ఉంటాయి. దీనిలో మొదటి అక్షరం (తల) తీసివేయగా
అది క్షుద్రదేవతను తెల్పుతుంది. దీని మొదటక్షరం (తల) తీసివేసిన తక్కెడను తెలుపుతుంది.
దీని మొదటక్షరం తీసివేస్తే అది రాజు అనే అర్థం వచ్చే పదమౌతుంది. ఇంతకు ఆ పదం ఏది?

దీనికి సమాధానం - కపోతరాజు

కపోతరాజు లో "క"- తీసివేసిన పోతరాజు అవుతుంది.

పోతరాజు అనేది ఒక క్షుద్రగ్రామదేవతను తెల్పుతుంది.
పోతరాజు లో "పో" తీసివేసిన తరాజు అంటే తక్కెడ,
తరాజు లో "త" తీసివేసిన రాజు అవుతుంది.
కావున పోతరాజు అనే సమాధానం సరిపోతుంది.

**ప్రహేళికకు తెలుగులో పొడుపుకథ అనికూడా అంటారు.**
**ఈ క్రింది పద్యం చూడండి.**

**కొండనుండు నెమలి కోరిన పాలిచ్చు**
**పశువు శిశువు తోడ పలుక నేర్చు**
**వనిత వేదములను వల్లించు చుండును**
**బ్రాహ్మణుండు కాకి పలలము దిను**

బ్రాహ్మణుడు పలలము(మాంసం) తినడు. కాకి మాంసం ఎవ్వరూ తినరు. అది బ్రాహ్మణుడు తింటాడు
అనటు అసలే కుదరదు. పై పాదాలలోని వాటికి అర్థం సమన్వయం కాదు.
అందుకే ఇది పొడుపుకథ.

దీనిలో ఉన్న గమ్మత్తంతా ఏమిటంటే ఒక్కొక్కపాదం ఒక్కొక్క వాక్యంగా కనబడటం.
ఆవిధంగా కవిరాయడం. దాని అర్థాన్ని ఇప్పుడు పరిశీలిద్దాం.

**కొండనుండు నెమలి - కోరిన పాలిచ్చు పశువు**
**శిశువుతోడ పలుకనేర్చు వనిత**
**వేదములను వల్లించుచుండను బ్రాహ్మణుండు**
**కాకి పలలము తిను.**
ఇప్పుడు చిక్కుముడి విడిపోయింది కదా!

**శుద్ధకులజాత యొక సతి**
**యిద్ధరణిం దండ్రిఁ జంపి యెసఁద విశుద్ధిన్**
**బుద్ధిఁబితామహుఁబొందుచు**
**సిద్ధముగాఁ దండ్రిఁగనును చెప్పుఁడు దీనిన్**

దీని జవాబు - మజ్జిగ

(మజ్జిగకు తండ్రి పెరుగు, పెరుగుకు తండ్రి పాలు అనగా మజ్జిగకు తాత పాలు.
మజ్జిగ తండ్రిని(పెరుగు)ను చంపి పుట్టును. అట్లా పుట్టిన మజ్జిగ, తాతను(పాలను)
చేమిరి రూపంతో పొంది, మరల తండ్రిని కంటున్నది.)

కందుకూరి రుద్రకవికి ఇచ్చిన సమస్య ఇది.
"దంష్ట్రల మీద శంకరుడు తాండవమాడెను రాముకైవడిన్" - అనేదానిలో
ప్రాస బిందు పూర్వక "ష్ట" ఇది దుష్కర ప్రాసము. దీన్ని పూరించి పండితత ప్రశంసలకు
పాత్రుడైనాడు కందుకూరి రుద్రకవి.
ఇది అంతర్లాపిక ప్రహేలికగా క్రమాలంకారంలో పూరించినాడు.

**రిం ష్టహి యేమిటన్ గరచు? బుక్షము లెక్కడ నుండు? అంధకున్**
**సం ష్టను జేసె నే విభు? డనంతర మందతడేమి చేసెనో?**
**రుం ష్టఖి లాత్ముడైన లవు రూప మదే గతి నుండు? చెప్పుమా?**
**దం ష్టల,మీద,శంకరుడు,తాండవమాడెను, రాము కైవడిన్**

రిం ష్టహి - కరిచే స్వభావంగల పాము, సం ష్టనుడు - నశించే ప్రాణాలు కలవాడు, రుం ష్టఖిలాత్ముడు - రోష స్వభావుడు.

దీనిలోని మూడు పాదాలలోని ప్రశ్నలకు నాలుగవ పాదంలో జవాబులు ఉన్నాయి అందుకే ఇది అంతర్లాపి ప్రహేలిక అవుతుంది.

1. పాము దేంతో కరుస్తుంది? - దం ష్టలతో
2. చుక్కలెక్కడ ఉంటాయి? - మీద
3. అంధకుణ్ణి చంపినదెవరు? - శంకరుడు
4, తరువాత అతడేం చేశాడు? - తాండవము ఆడాడు
5. లవుని రూపం ఎలా ఉంటుంది? - రామునిలా

వెంకటగిరి సంస్థానంలో మోచర్ల వెంకనకు ఇచ్చిన దుష్కరప్రాస సమస్య. దీన్ని వెంకనగారు క్రమాలంకాంలో ప్రహేళికా పద్ధతిలో పూరించాడు.

**ఈక్రా ప్రాసము కష్టమౌ ననుచు మీరెంతేసి వాదాడగా**
**వాక్రా సంబది సత్కవీశ్వరుల త్రోవల్ గామి నే చెప్పెదన్**
**దిక్త్రారాతికి పార్వతీశ్వరులకున్ తిగ్మ ప్రభారాశికిన్**
**వక్త్రంబుల్ పది కన్నులైదు కరముల్ వర్ణింపగా వేయగున్**

ఈ కవి పూరణ ఎంత చిత్రమో. మొదటి రెండు పాదాలు ప్రాసను గురించి విమర్శించటంతో సరిచేశాడు. మూడవ పాదం పూరణకు క్రమాలంకారంతో ప్రహేళికగా మార్చాడు.

దిక్త్రారాతి = దిక్పాలకులకు శత్రువు = రావణాసురుడు, అతనికి పది నోళ్ళు అందుకే అతనికి దశాస్యుడని పేరు. పార్వతి ఈశ్వరులకు కలిపి కన్నులు 2 + 3 = 5,
తిగ్మప్రభారాశి అంటే సూర్యుడు ఇతనికి సహస్రకిరణుడు అని పేరు. అంటే వేయి చేతులు గలవాడు.
మూడవ పాదంలోని వాటికి నాల్గవ పాదంలోని వాటిని కలుపుతూ వెళితే ఈ విధంగా ............
రావణాసురునికి(దిక్త్రారాతికి) నోళ్ళు(వక్రంబులు) - 10
పార్వతీ పరమేశ్వరులకు కలిపి కన్నులు - 5
సూర్యునికి (తిగ్మ ప్రభారాశికి) కరములు(చేతులు) - 1000

"రాధేయుఁడు నందినెక్కి రావణుగెలిచెన్" - అనే సమస్యను ఒక కవి ఎంత చమత్కారంగా క్రమాలంకారంలో ప్రహేలికా పద్ధతిలో పూరించాడో చూడండి.

**యోధెవ్వఁడు కురుబలముకు**
**మాధవ సఖుఁడేమి యెక్కిమఱి తిరుగాడున్**
**సాధించె రాముఁడెవ్వని**
**రాధేయుఁడు నందినెక్కి రావణుగెలిచెన్**

దీన్ని ఇలాగే చదివితే అర్థం బోధపడటం కష్టమే.
రాధేయుఁడు నందినెక్కి రావణుగెలిచెన్ - ను
రాధేయుఁడు, నందినెక్కి, రావణుగెలిచెన్ అని మూడు భాగాలుగా తీసుకొని ప్రశ్నప్రకారం సమాధానంగా తీసుకోవాలి

కురుబలముకు యోధెవ్వఁడు - రాధేయుడు(కర్ణుడు)
మాధవ సఖుఁడేమి యెక్కిమఱి తిరుగాడున్ -
(శివుడు ఏమి ఎక్కి తిరుగును) - నంది
రాముఁడెవ్వని సాధించె (రాముడు ఎవరిని గెలిచాడు)
 - రావణు గెలిచెన్

ఇది ఒక ప్రహేలిక లేక పొడుపుకథ ఇందులోని విషయాన్నంతా చదివి ఆలోచించి సమాధానం చెప్పాలి దీనికే విచ్చుడుకత అని అంటారు.
చూడండి మరి.....

**నగతనయన్ అరన్ సిరిని నాలుగు వర్ణములన్ లిఖించి, పొం దుగ నొక యక్షరంబు తుద దూకొని నిల్పిన యంతలోననే యగును, గజాననుండు, మరియందొక యొక్కొక్క యక్షరంబు, డిం చగను, చతుర్ముఖుండు, శరజన్ముడు, పంచశరుండు వహ్నియున్**

దీని సమాధానం - "ఉమాకుమార"
నగతనయన్ - పర్వతరాజ పుత్రిక అయిన ఉమ(పార్వతి),
ధరన్ - భూమి అర్థాన్నిచ్చే కు ను,
సిరిని - లక్ష్మిని తెలిపే మా ను,
ఈనాలుగు వర్ణాలను వరుసగా రాసి,
చివర మరొక అక్షరాన్ని, దూకొని - అంగీకరించి,
చేర్చినంతలో
ఉమాకుమార అవుతుంది -
దీన్నుండి గజాననుండు - వినాయకుడు వస్తాడు.
మరలా వరుసగా ఒక్కొక అక్షరాన్ని,
డించగ - తగ్గించగా ఉమాకుమార లో "ఉ" తొలగిస్తే - మాకుమార -
అంటే లక్ష్మీకుమారుడు - చతుర్ముఖుడు - బ్రహ్మ,
అలాగే మాకుమార నుండి "మా" తొలగిస్తే కుమార - అంటే శరజన్ముడు - కుమారస్వామి,
అలాగే కుమారలో "కు" తొలగిస్తే
మిగిలింది "మార" అంటే పంచశరుడు(మన్మథుడు),
దీనినుండి "మా" తొలగించిన మిగిలేది "ర".
ర అంటే వహ్ని (అగ్ని) వరుసగా వస్తాయి.

దీనికి ప్రహేలిక అనే కాకుండా దీన్ని "చ్యుతచిత్రం"గా కూడా చెప్పవచ్చు.

ఈ పద్యం చదివి అయిదక్షరాల ఆ పురము పేరేదో కనుక్కోండి?

**ఒక్క పురము పేరొప్పునై దక్కరముల**
**మొదటి మూడు వత్సరమునకు బేరుచివరి**
**రెండును వీధికి జెల్లు, వేణియగు ద్వితీయాంతముల, జెప్పుడా పురమ్ము**

దీని సమాధానం - విజయవాడ
దీనిలో 5 అక్షరాలు ఉన్నాయి.
మొదటి మూడక్షరములు సంత్సరానికి పేరు. విజయ
- ఇది తెలుగు సంవత్సరాలు ప్రభవ, విభవ, శుక్ల, ప్రమోదూత, ప్రజోత్పత్తి........ మొదలైన 60 పేర్లలో ఒక పేరు.
చివరి రెండక్షరాలు - వాడ. అంటే వీధి,
2వ మరియు చివరి అంటే 5వ అక్షరాలు కలిపితే జడ.
అంటే వేణి అని అర్థం.
కావున విజయవాడ అనే సమాధానం సరిపోయింది.

ఈ క్రింది పద్యం భావమేమిటో గమనించండి.

**మూడు శిరములుండు, ముద మొప్ప పదికాళ్ళు**
**కరములుండు రెండు, కన్నులారు**
**కొమ్ములెన్న నాలుగును, తోకలు మూడు**
**దీని భావమేమి తిరమలేశ!**

సమాధానం - నాగలిదున్నే రైతు

నాగలికి రెండు ఎడ్లను కట్టినపుడు 2 ఎడ్లు 1 మనిషి మొత్తం మూడు తలల,
రెండెడ్లకు 8, మనిషికి రెండు మొత్తం 10 కాళ్ళు,
మనిషి మాత్రమే కరములు అవి రెండు,
రెండెడ్లకు మనిషికి మొత్తం 6 కండ్లు, రెండెడ్లకు 4 కొమ్ములు,
రెండెడ్లకు నాగలికి(మేడితేక) మొత్తం మూడు తోకలు.
ఇదీ దీని అర్థం.

క్రీ.శ. 1324లో నివసించిన అమీర్ ఖుస్రూ పారశీక కవి.



ఈయన హిందీలోనూ కవిత్వం చెప్పినవాడు.
ఒకానొకచోట తను ఢిల్లీపరిసరాల్లో మాట్లాడే భాషలోనే కవిత్వం రాస్తానన్నాడు.

ఒక ఫారసీ పద్యంలో ఈ విధంగా అన్నాడు.

**చు మన్ తూతియే హిందమ్, అర్ రాస్త్ పుర్సీ**
**జెమన్ హిందు యీ పుర్స్, తానగ్జ్ గోయమ్**

(వాస్తవంగా నేను భారతీయ శుకమును-
నన్నేదయిన అడుగదలచిన హిందుయీ లో అడుగుడు.
అందు మధురముగా మాటాడ గలను.)
ఇక్కడ హిందుయీ అనగా హిందీకి మొదటి పేరు.

ఈ కవి చెప్పిన ఒక పొడుపు పద్యం

**బాలా థాజబ్ మన్ కో భాయా**
**బడా హు వా కుచ్ కామ్ న ఆయా**
**ఖుస్రూ క హ దియా ఉస్కా నాఁవ్**
**బూఝో నహీతో ఛోడో గాంవ్**

(బాల్యమున అది మనోహరమైనది.
పెఱిగిన పిదప ఎందుకును పనికిరాలేదు
(ఖుస్రూ అన్నాడు) దాని పేరు ఊహించండి
లేదా ఊరు విడిచి పొండు)
సమాధానము - దీపం

మరో పొడుపు పద్యం

**ఏక్ థాల్ మోతీ సే భరా,**
**సబ్ కే సర్ పర్ ఔంథా ధరా,**
**చారోఁ ఓర్ వో థాల్ ఫిరై,**
**మోతీ ఉన్ సే ఏక్ న గిరై.**

(ముత్యములతో నిండిన ఒక పళ్లెరము
అందఱ తలలపైన బోర్లించి ఉన్నది
ఆ పళ్లెరము నాల్గు వైపుల తిరుగుచున్నను
అందుండి ఒక ముత్యమైనను రాలదు.)

సమాధానము - ఆకాశము

ప్రాకృతంలో "సురసున్దరీచరియం" అనే కావ్యం ఒక ప్రేమాఖ్యానం.
దీన్ని క్రీ.శ. 1095లో "ఘనేశ్వరసూరి" రచించాడు.
ఇందులో 4001 గాథలున్నాయి. దీనిలో ప్రధానమైన కథ సురసుందరీ కథ.
ఇది చాల చిన్నకథ. దీనిచుట్టు అనేక కథలు అల్లబడ్డాయి.
దీనిలో సురసుందరి మకరకేతును పెండ్లాడుతుంది.
వీరిద్దరు ఉద్యానవనంలో క్రీడించే సమయంలోని
ప్రశ్నోత్తరచిత్రం ఇక్కడ గమనిద్దాం.

**కిం ధరఇ పిన్నచందో, కిం వా ఇచ్ఛంతి పామరా భిత్తే**
**ఆమంతసు అంతగురుం కిం వా సోక్ఖం పుణో సోక్ఖం**
**దట్ఠూణ కిం విసట్టఇ కుసుమవణం జణియజణమణాణందం**
**కహ ణు రమిజ్జఇ పఢమం పరమహిలా జారపురిసేహిం**

ఇందులోని అన్ని ప్రశ్నకు సమాధానం - స-సం-కం

1. పూర్ణచంద్రుడు తనలో దేనిని ధరిస్తాడు
జ.- ససం (చెవుల పిల్లిని ధరిస్తాడు)

2. వ్యవసాయదారులు వ్యవసాయానికి ఏమి కావాలని కోరుకుంటారు
జ.- కం (జలం)

3. చివర గురువున్న (గణం) ఏది
జ.- స (స - గణం)

4. సుఖం ఏది
జ.- సం -శం(సుఖం)

5. మళ్లీ సుఖం ఏది
జ.- కం (సుఖం)

6. పుష్పసముదాయాలు ఎవనిని చూచి వికసిస్తాయి
జ.- ససంకం - శశాఙ్కమ్ (చంద్రుణ్ణి)

7- పరస్త్రీ ఎవరైనా జారపురుషునితో మొదట ఎలా రమిస్తుంది
జ.- సశంకం (శంకిస్తూ, భయపడుతూ)

---

ఈ పద్యం చదివి సమాధాన మివ్వండి.

**తరువున మూఁడక్షరములు**
**స్థిరముగ నడి మక్షరంబు తీసిన కోఁతౌ**
**తరు వెయ్యదొ కోఁతెవ్వరొ**
**యెఱిఁగింపుము దీని నాకు నింపొద వంగన్**

ఈ పద్యంలో ఉన్నదేమిటంటే
ఒక చెట్టు పేరుకు మూడు అక్షరాలు ఉన్నయి.
వాటిలోని ఆ మూడక్షరాల్లో మధ్య అక్షరం తీసివేస్తే
మిగిలిన రెండక్షరముల అర్థం కోతి వస్తుంది.
మరి ఆ చెట్టు పేరేమి?

సమాధానం - వావిలి

ఇందులో మూడక్షరాలు ఉన్నాయి.
వావిలి అనేది చెట్టుపేరు.
దీనిలోని మధ్య అక్షరం "వి" - తీసివేస్తే వాలి.
వాలి అనేది కోతి కదా!

---

ప్రశ్నలు సమాధానాలు ఒకే పద్యంలో ఉంటే
దాన్ని "అంతర్లాపిక ప్రహేలిక" అంటారు.
ఇలాంటివి ముందు కొన్ని తెలుసుకొని ఉన్నాము.
ఇక్కడ మరొకటి చూద్దాం.

**విష్ణుదేవుని పత్నియై వెలయునెవతె**
**ఎవ్వరేతేర పాద్యాదు లిచ్చుచుంద్రు**
**హిమకరుడు పుట్టగా, రాత్రి ఏది వచ్చు**
**కమలబాంధవుడేతేర కలువవిచ్చె**

1. విష్ణుపత్ని ఎవరు?
2. ఎవరు వస్తే పాద్యాదులు ఇస్తూ ఉంటారు?
3. హిమకరుడు(చంద్రుడు) పుట్టగా రాత్రి విచ్చేది ఏది?
కమల బాంధవుడు - సూర్యుడు,
ఏతేర - రాగా,
కలువవిచ్చె - కలువ వికసించింది -
విపరీతమైనదికదా!
ఎలాసాధ్యం?

దీనిలోని చిక్కును విడదీయడం ఏమిటి అంటే
చివరి పాదంలోని పదాలను
కమల- బాంధవుడేతేర - కలువ విచ్చె -
అని విడదీస్తే పై ప్రశ్నలకు సమాధానాలు
వరుసగా సరిపోతాయి.
చూడండి.

1. విష్ణుపత్ని ఎవరు? - కమల (లక్ష్మి)
2. ఎవరు వస్తే పాద్యాదులు ఇస్తూ ఉంటారు? - బాంధవుడేతేర (బంధువురాగా)
3. హిమకరుడు(చంద్రుడు) పుట్టగా రాత్రి విచ్చేది ఏది? - కలువ
విచ్చె (కలువపూవు వికసించింది)

---

ఈ పొడుపు పద్యం చూచి సమాధానం ఊహించండి.

**కరణాల చేతిలో గలుగు నాయుధ మేది?**
**కానకు గుణమీయఁ గలుగు నేది?**
**బాలుండు వ్రాతకై పట్టుకొనెడి దదేది?**

**పరగృహంబునకేది వరలు కప్పు?**
**యింటి లోపలికేగ నేమిదాటఁగవలె?**
**భర్తకై యిల్లాలు బఱచునేమి?**
**శార్కరి నేమని జనులు వాకొందురు?**
**చెలఁగి మూషక మేమి జేయుచుండు?**

**నన్నిఁటికి జూడ మూఁడేసి యక్షరములు**
**నీ వలావల గనసరి నెన్నవలయు**
**(చిత్త భవ భంగ శివలింగ చిన్మయాంగ**
**వృషతురంగ శుభాంగ గౌరీశ లింగ)**
(అమరాబాదు లక్ష్మయ్య రచన)

దీని సమాధానాలు మూడు అక్షరాల్లోనే ఉండాలి.
సమాధానం నీవల ఆవల అంటే ముందుకు ఒకసారి
రెండవది వెనుకకు తీసుకోవాలి.
ఈ విధంగా గమనిస్తే సమాధానాలు దొరకుతాయి.

1. కరణాల చేతిలో గలుగు నాయుధము ఏది? - కలము
2. కానకు గుణమీయ గలుగు నేది? - ములక (కలము నకు విలోమము)
3. బాలుడు వ్రాతకై పట్టుకొనెడి దదేది? - పలక
4. పరగృహంబునకేది వరలు కప్పు? - కలప (పలక కు విలోమము)
5. యింటిలోపలికేగ నేమి దాటగవలె? - గడప
6. భర్తకై యిల్లాలు బఱచునేమి? - పడక (గడప కు విలోమము)
7. శార్కరి నేమని జనులు నాకొందురు? - గులక
8. చెలగి మూషిక మేమి జేయుచుండు? - కలుగు(గులక కు విలోమము)

**గృహలక్ష్మి** (పత్రిక)1931 మార్చిలో
**శ్రీమతి ఆచంట సత్యవతమ్మ** ఇచ్చిన
ప్రశ్నోత్తరచిత్ర ప్రశ్న
చూడండి.

**ఆరక్షరంబుల ఆర్యుల గ్రంథమ్మ**
**అతి వ్యాప్తి నొందుచు నలరుచుండు**
**ఆద్యక్షర ద్వయంబనువుగా భగవంతుఁ**
**గొలుచు వారిని తెల్పు కొమరు మిగిలి**
**ఒకటైదు ఆరులు ఒనరంగ కలిపిన**
**భీతికి మారు పేరతికి యుండు**
**నాలుగైదారక్షరాలను గల్పంగ**
**గెలుపున కర్థంబు నెలమిగాంచు**
**మూఁడు నాల్గయిదాఱు మోదంబు దీపించు**
**సంపూర్ణ జయమును సరవిదెల్పు**
**అట్టి పుస్తక నామంబు నరసిమీరు**

**ఆర్య మత జ్ఞానమభివృద్ధియగు విధాన**
**పత్రికా బాల "గృహలక్ష్మి" కందఁజేసి**
**యశము నొందంగ బూనుడో అమ్మలార!**

సమాధానము - **భక్తవిజయము**
1. ఇందులో 6 అక్షరాలు ఉన్నాయి
2. మొదటి రెండు అక్షరాలు - **భక్త** - భగవంతుని కొలిచేవారిని తెలుపుతుంది.
3. ఒకటి, ఐదు, ఆరు అక్షరాలు కలిపిన భీతికి మారు పేరు - **భయము.**
4. నాలుగు, ఐదు, ఆరు అక్షరాలను కలుపగా గెలుపని అర్థము - **జయము**.
5. మూడు, నాలుగు, ఐదు, ఆరు అక్షరాలను కలిపిన సంపూర్ణ జయమును తెలుపుతుంది - **విజయము**

---

**రెండు ముఖములు గలుగు ఘనుండెవండు?**
**మూడు మోములుగల జగత్పూజ్యు డెవడు?**
**నాల్గు మోములుగల లోకనాథుడెవడు?**
**ఐదు వక్త్రము లొప్పిన యనఘుడెవడు?**
**ఆరు నిటలంబు లలరు సుధీరుడెవడు?**
**పది లలాటంబుల చెలగు ప్రభుడెవండు?**
**నూరు ఫాలంబులను గ్రాలు వీరుడెవడు?**
**వేయి వదనంబుల వెలుగు విబుధుడెవడు?**

ఇందులో అన్నీ ప్రశ్నలే తప్ప ఎలాంటి షరతులు లేవు కావున ఆలోచించగా ఆన్సరు వచ్చు.

సమాధానాలు-
1. 2 నోళ్ళుగల గొప్పవాడు ఎవరు? - **అగ్ని**
2. 3 ముఖాలున్న లోకపూజ్యుడు ఎవరు? - **దత్తాత్రేయుడు**
3. 4 నోళ్ళున్న జగన్నాథుడు ఎవరు? - **బ్రహ్మ**(చతుర్ముఖుడు)
4. 5 మోములున్న పుణ్యమూర్తి ఎవరు? - **శివుడు** (పంచముఖుడు)
5. ఆరు నోరులుగల వీరుడు ఎవరు? - **కుమారస్వామి**(షణ్ముఖుడు)
6. పది ఫాలములున్న ప్రభువు ఎవరు? - **రావణుడు**(దశముఖుడు)
7. నూరు నుదురులున్న వీరుడు ఎవరు? - **శతముఖ రావణుడు**
8. వేయి నోళ్ళతో వెలుగొందువాడు ఎవరు? - **ఆదిశేషుడు**

---

**ఏకచక్రము బండి నెక్కు రేడెవ్వడు?**
**ఒడలెల్ల గనులైన యొడయ డెవడు?**
**మఱ్ఱియాకున బండు కుఱ్ఱవా డెవ్వడు?**
**శివుని యొాదల జేర్చి చెలగు నెవడు?**
**సమతమై సర్వభూతముల నేలునెవడు?**

**వాయుభక్షణచేసి బ్రతుకు నేది?**
**అఖిల జీవంబుల కాధారమగు నేది?**
**కొమరారు మారుని గుఱ్ఱమేది?**
**కంధి దాటి లంకగాల్చిన మృగమేది?**
**క్షితిని జల్లబడగ జేయునేది?**
**అరయ నన్నిటికిని నక్షర ద్వయమున**
**నొక్కయుత్తరంబె నొసగ వలయు**

ఈ సీసపద్యంలో 10 ప్రశ్నలు ఉన్నాయి.
అన్నిటికి రెండక్షరాల సమాధానం

ఒక పదమే చెప్పాలి ఆలోచించండి.

---

1. ఒకే చక్రంగల రథంపై ఎక్కి తిరుగువాడు - **సూర్యుడు**
2. దేహంనిండా కన్నులు కలవాడు - **ఇంద్రుడు**
3. మఱ్ఱిఆకుపై పరుండు బాలుడు - **విష్ణువు**
4. శివుని శిరస్సుపై వెలుగువాడు - **చంద్రుడు**
5. అన్ని ప్రాణులను సమానంగా పాలించువాడు - **యముడు**
6. గాలిమేసి బ్రతికేది - **పాము**
7. అన్ని జీవులకు ఆధారమైనది - **వాయువు**
8. మన్మథుని గుఱ్ఱం - **చిలుక**
9. సముద్రందాటి లంకను కాల్చినది - **కోతి**(హనుమంతుడు)
10. భూమిని చల్లబడునట్లు చేయునది - **వాన**

వీటి అన్నిటికి రెండక్షరాల పదం కావాలి.
అది :- **హరి**
హరి పర్యాయపదాలు-
1. సూర్యుడు,2. ఇంద్రుడు, 3. విష్ణువు, 4. చంద్రుడు,
5. యముడు, 6. పాము, 7. వాయువు, 8. చిలుక,
9. కోతి, 10. వాన, 11. సింహం, 12. కిరణము,
13. గుఱ్ఱము, 14. కప్ప 15. కపిలము(బంగారుఛాయ గలది)
ఇలా చాలా అర్థాలున్నాయి నిఘంటువుల్లో.
కావున సరైన సమాధానం - **హరి**.

---

ఈ పద్యం భావమేమో చూడండి.

**కమల గర్భుండరయగా ముఖస్థదారు,**
**రమకు నాయకుండరయ ఉరస్థదారు,**

**ప్రమథ నాయకడరయ శిరస్థదారు,**
**దీని భావమేమి .........**

పారసీ భాషలో దార్ శబ్దానికి కలవాడు,
ఉంచుకొనువాడు - అనే అర్థాలున్నాయి.
అదే సంస్కృతంలో ధార శబ్దానికి భార్య అని అర్థం.
ఈ రెండు భాషా శబ్దాలతో కవి
త్రిమూర్తులను అన్యాపదేశంగా, చమత్కారంగా, అపహాస్యం చేస్తున్నాడు.

కమలగర్భుడు బ్రహ్మ.
బ్రహ్మ నోటిలో సరస్వతి ఉంటుందికదా!
అందుకే ముఖస్థదారు అంటున్నాడు.
రమకు నాయకుడు విష్ణువు.
విష్ణువు ఉరములో లక్ష్మీదేవి ఉంటుంది.
కావున ఉరస్థదారు అన్నాడు.
ప్రమథ గణాలకు నాయకుడు శివుడు.
శివుడు గంగను శిరస్సుపై ఉంచుకున్నాడు.
కావున ఆయన శిరస్థదారు.

ఇదే పొడుపు పద్యాన్ని వేమన పద్యాలలో

**పడతి మోసెనొకడు, పడతి మేసెనొకడు**
**పడతి నెదను బెట్టి బ్రతికె నొకడు**
**పడతికొరకు నిట్లు పలుపాట్లు పడిరయా**
**విశ్వదాభిరామ! వినురవేమ!**

దీనికి విరుగుడులాంటి పద్యం

**స్త్రీ నెత్తిన రుద్రునకు**
**స్త్రీ నోటను బ్రహ్మకెపుడు సిరిగల్కంగా**
**స్త్రీ నెదిరి రొమ్మున హరికి**
**స్త్రీ నెడపగ గురుడవీవు దేవర వేమా!**

---

ఈపద్యంలోని ప్రశ్నకు చెప్పగలరేమో చూడండి.

**వాయుదేవుని వహియించు వాహనమేది?**
**వానచినుకుల గ్రోలెడి పక్షి యేది?**
**చంపక పరీమళంబు సహింపదేది?**
**తలను ముత్యాలుగల మృగతిలకమేది?**

## అన్నిటికి నొక యుత్తరం బమరవలయు

ప్రశ్నలను వివరంగా గమనిస్తే.......
1. వాయుదేవు(గాలి)ని మోసెడి వాహనమేది? - **లేడి**
2. వానచినుకుతో బ్రతికే పక్షి ఏది? - **చాతకపక్షి**
3. సంపెంగ వాసన సరిపడనిది ఏది? - **తుమ్మెద**
4. తలలో ముత్యాలుగల శ్రేష్ఠమృగము ఏది? - **ఏనుగు**

పై ప్రశ్నల సమాధానాలు - లేడి, చాతకపక్షి, తుమ్మెద, ఏనుగు
ఈ పదాలన్నిటిని నానార్థంగా గల పదం బాగా ఆలోచిస్తే తెలుస్తుంది.
అది ... అది.. ఆ.. సారంగము
సారంగానికి పర్యాయపదాలు -
తుమ్మెద, ఏనుగు, వానకోయిల(చాతకపక్షి), ఇఱ్ఱి, చిరుతపులి,
ఒదెకొంగ, నెమలి, గొడుగు, మబ్బు, వెంట్రుగ, నగ, పువ్వు, బంగారు,
కప్పురము, విల్లు, తామర, చిత్రవర్ణము, రాత్రి, నేల, శంఖము, చందనము,
వెలుఁగు, ఒక స్త్రీరాగము.

నిఘంటువులో ఇన్ని అర్థాలున్నాయి మరి.
ఇవి తెలిస్తే పొడుపు పద్యం సమాధానం సులభంకదా!

---

ఈ పొడుపు పద్యంలోని రెండేసి ప్రశ్నలకు ఒక సమాధానం
సరిపోయేవిధంగా సమాధానం చెప్పగలరేమో? చూడండి.

**ఇంటికి వింటికి బ్రాణ మేది చెప్పుమ?**
**కంట మింటను మనమేమి కాంచగలము?**
**నవ్వ, పువ్వ దేనినుండి పొలుపు గాంచు?**
**ఒకటే రెండేసి ప్రశ్నల కుత్తరంబు.**

పై పద్యంలో ప్రతి పాదంలో 2 ప్రశ్నలు ఉన్నాయి.
ప్రతి రెండు ప్రశ్నలకు సమాధానం ఒకటిగానే ఉండాలి.
అవి ఆలోచించి చూడగా......
ఇంటికి ప్రాణం ఏది? - **ఇల్లాలు** ( స్త్రీ )
వింటికి ప్రాణం ఏది? - **అల్లెత్రాడు**
ఈ రెంటిని నానార్థాలుగల పదం - **నారి**

కంట (కంటిలో), మింటిలో(ఆకాశంలో) మనం ఏంచూస్తాము
మనకంటిలో చూసేది ఏది? - **కంటిపాప**
ఆకాశంలో మనం చూసేది ఏది? - **నక్షత్రాలు**
కంటిపాపను, నక్షత్రాలను నానార్థాలుగా గల పదం - **తార**

నవ్వుగాని దేన్ని చూసి సంతోషపడతాము - **వలపు**(ప్రేమ),
పువ్వు దేనితో కలిసి అందంగా ఉండగలవు - **వాసన**
వలపు, వాసన రెండింటికి కలిపి నానార్థంగా ఉన్న పదం ఏది - **వలపు**

పువ్వుగాని దేనితో? కూడి అందంగా ఉండగలవు - **వలపు**

ఈ క్రింది పొడుపు పద్యానికి సమాధానం ఆలోచించండి.

**శ్రీమంతుడును భార్య చెలగుచు నొక్కటి**
**కీలంబు శాఖయు గ్రాలు నొకటి**
**రదనంబు కాకంబు రహిమీద నొక్కటి**
**యవనిక యును చాప నెనయ నొకటి**
**పత్రంబు గ్రావంబు పరగంగ నొక్కటి**
**నేత్రంబు శిశువును నెనయ నొకటి**
**వెన్నుండు మరికాంత వివరింప నొక్కటి**
**వస్త్రంబు మగజాతి వరుస నొకటి**
**అన్నిటికి జూడ నాల్గేసి అక్షరములు**
**ఏకపదముగ జెప్పుడీ యిలను బుధులు**
**చెప్పగలిగిన నేనిత్తు చిన్న మాడ**
**చెప్పలేకున్న నగుదు నే చిన్ననగవు**

ఈ పద్యంలోని ప్రశ్నలు 8
వాటికి అన్నిటికి నాలుగక్షరాల సమాధానం చెప్పాలి.

సమాధానాలకై ఆలోచిద్దాం.

1. ధనవంతుడు, భార్య - ఒకేపదంలో ఇమిడి ఉండేపదం సమాధానమౌతుంది
   **ధనికురాలు** (ధని - ధనం గలవాడు, ఆలు - భార్య)
2. మేకు(కీలము), శాఖ(కొమ్మ) రెండు కలిసినపదం సమాధానం-
   **చీలమండ**(చీల - మేకు, మండ - కొమ్మ(శాఖ))

3. పన్ను(రదనం), కాకి రెండు కలిసినపదం సమాధానం -
   **పలుగాకి**(పలు - కాకి) (పలు - పన్ను(దంతము), కాకి - పక్షి)
4. తెర(యవనిక), చాప రెండు కలిసినపదం సమాధానం -
   **తెరచాప** (తేర- యవనిక(అడ్డువల), చాప - తుంగ, తాటి ఆకులతో నేసినచాప)
5. పత్రము, పాషాణము(గ్రావంబు) రెండు కలిసినపదం సమాధానం-
   **ఆకురాయి**

6. కన్ను(నేత్రం), చిన్నబిడ్డ(శిశువు) రెండు పదాలు కలిసినపదం సమాధానం-
**కనుపాప**

7. విష్ణువు(వెన్నుడు), కాంత రెండు కలసినపదం సమాధానం -
**విష్ణుకాంత**(ఒక పువ్వు)
8. బట్ట (వస్త్రం), మగజాతి రెండు కలిసినపదం సమాధానం -
**చీరపోతు**(తెల్లపేను)

ఈ క్రింది శ్లోకం చూసి అందలి ప్రశ్నలకు సమాధానాలు ఆలోచించండి.

**కిం క్రూరం స్త్రీహృదయం**
**కం గృహిణ: ప్రియహితాయ దారగుణా:**
**క: కామస్సంకల్ప:**
**కిం దుష్కరసాధనం ప్రజ్ఞా**
(దండి - దశకుమారచరిత్ర)

ఇందలి ప్రశ్నలు సమాధానాలు
1. కిం క్రూరం (క్రూరమైనదేది)?
- **స్త్రీల మనస్సు**(స్త్రీ హృదయం)
2. కిం గృహిణ: ప్రియహితాయ (గృహస్థునకు ఇష్టమైనదేది)?
- **భార్యగుణము**(దారగుణా:)
3. క: కామ (కామము ఏది)?
- **సంకల్పమే**(సంకల్ప:)
4. కిం దుష్కరసాధనం (కష్టమైన పనులను సాధించునది ఏది)?
- **బుద్ధి** (ప్రజ్ఞా)

ఈ క్రింది పద్యం చూచి జవాబుకై ఆలోచించిచూడండి.

**సుదతిరో! ఘనమైన సురభికి పేరేది?**
**శివభూషణములందు శ్రేష్ఠమేది?**
**చెరువు లోపల నీరు చేలకిచ్చుట కేది?**
**పైరు గోసిన వెన్క పండు నేది?**
**బలు ఫిరంగుల ధ్వనుల్ బల్కుట నది యేది?**
**చెలగి బంట్రోతులు సేయుటేది?**
**ఎనిమిది గడియల నేర్పడునది యేది?**
**ప్రభువులు కోపంబు సేయుటేది?**
**అన్నిటికి జూడ నొక్కక్క యక్షరంబు**

**సున్న దీర్ఘంబు లేర్పడ జెప్పవలయు**
**చిత్త భవభంగ శివలింగ చిన్మయాంగ**
**వృషతురంగ శుభాంగ గౌరీశలింగ**

ఈ పద్యంలో 8 ప్రశ్నలు ఉన్నాయి.
సమాధానాలన్నీ సున్న, దీర్ఘస్వరములతో కూడి
ఒకే అక్షరంగా ఉండాలి.
పరతులు తెలిశాయికదా!
ఆలోచించండి.

1. ఓ సుదతీ గొప్ప కామధేనువు పేరేమి?
   - గాం(గోవు)
2. శివుని అలంకారములలో శ్రేష్ఠమైనది ఏది?
   - పాం(పాము)
3. చెరువు నీటిలో చేలకు ఇచ్చునది ఏది ?
   - తూం(తూము)
4. జొన్న మొదలైన పైరు కోసిన తర్వాత పండునది ఏది?
   - నాం(జొన్నమొదలగు వాని పిలక)
5. అనేక ఫిరంగులు పేల్చిన శబ్దం ఎట్లుండును?
   - ధాం(ధామ్మని శబ్దం వినపడును)
6. బంట్రోతులు ఏమి చేయుదురు?
   - సాం (మంచి-తనం, మాట, లేక సలాం)
7. ఎనిమిది గడియలకు ఏది ఏర్పడును?
   - ఝాం(జాము)
8. ప్రభువులు దేనిపై కోపగింతురు?  -

ఏడింటికి సమాధానాలు ఉంచాము
8వదాని జవాబు మీరే ఊహించండి.



Add files

## Comments



**రమణరాజు. ఏ.వి.**

Add a comment